| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1. | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,200 |
| 2. | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 700 |
| 3. | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 600 |
| 4. | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | |

Fare includes complimentary Dormitary accommodation and transport / Guide charges. Tariff for Tour No. 4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్"లో బస చేయండి. ఢిల్లీలో మా హోటల్‌లోని అమరావతి/సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగుభోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

## Southern Travels/Hotel Southern

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi)**

**ఢిల్లీలోని తెలుగు వారి ప్రముఖ వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh, New Delhi - 110 005.**

**(Phones : 5722210 (10 Lines); 5739508, 5782932)**

**Our branches :**

1. Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones : 223658; 227233) Fax : 040 - 3328993
2. Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001. (Phones : 2267040; 2262633) Fax : 080-2252222
3. Hotel Howrah Complex, Opp. Madras Central Railway Station, Chennai - 600 003. (Phones : 564864; 585253) Fax : 044 - 585253
4. No. 10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet Vijayawada - 520 002. (Phones : 572227; 576624) Fax : 0866-470207
5. Pavan Palace, Ground Floor, Opp. T.S.R. Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phones : 545565, 541099) Fax : 0891 - 547190
6. No. 12 (Ground Floor), Manish A.C. Market, Near Dadar West, Mumbai-400 028. (Phones : 4326895; 4326688.)



Phone : 4941973

# అఖిలభారత్ షిర్డిక్షేత్ర సాయి భక్తనివాస్ ట్రస్ట్

పుష్పాంజలి హోటలు వెనుక, షిర్డి, (మహారాష్ట్ర)

అండర్ ది మేనేజ్‌మెంట్ ఆఫ్

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ

73-A, శాంతోమ్ హైరోడ్, చెన్నై - 600 028.




ఆర్యా!

శ్రీరామ దత్తాత్రేయుల కలియుగ అవతార పురుషుడే శ్రీ షిర్డిసాయిబాబా. సహృదయముతో వారిని నమ్మి ప్రార్థించువారికి వారివారి కోరికలను తీర్చు భగవంతుడితడు. సమాధినుంచే ఈయన భక్తులను దీవించెదరు. సాయిబాబాను దర్శించుటకు వచ్చు భక్తుల వసతి సౌకర్యార్థమై మన సంస్థ ఒక చక్కని వసతిగృహమును నిర్మించుటకు ఒక పథకము వేసియున్నది. ఈ వసతిగృహములో ధ్యాన మందిరము, లాకర్లతో కూడిన జనతా హాలు, మరియు అన్ని విధములైన ఆధునిక సౌకర్యములతో కూడిన సుమారు వంద రూములు, రెస్టారెంటు ఉండును. ఈ భవన నిర్మాణమునకు సుమారు రెండుకోట్ల రూపాయలు వ్యయమగునని అంచనా వేయబడియున్నది. షిర్డి ఒక గొప్పక్షేత్రము. తిరుమలలో నుండు ఈ సంస్థ సత్రము పలువురి ప్రశంసలందుకొని యుండుట అందరికీ తెలిసిందే. ఈ ఆధునిక వసతులతో కూడిన భవన నిర్మాణమునకు భక్తులెల్లరు ధారాళముగా విరాళములు యిచ్చి ఈ పథకమును విజయవంతము చేయ ప్రార్థన. ఈ నిర్మాణము అన్ని కులాల ప్రాతిపదికన ఏర్పాటు గావించ బడినది. చెక్కులు/ డ్రాఫ్టులు చెన్నైలోనే మారునట్లుగా పంపవలయును.

## డొనేషన్ వివరములు :

1) రూము డొనేషన్ : Rs. 1,01,116/- 1 సం॥లో 25 రోజుల రూము వసతి.
ఇద్దరయితే చెరి : Rs. 60,116/- సం॥లో 12 రోజుల రూము వసతి.

2) చక్రవర్తి పోషకులు : Rs. 50,116/- 1 సం॥లో 10 రోజుల రూము వసతి.

3) మహారాజ పోషకులు : Rs. 25,116/- 1 సం॥లో 5 రోజుల రూము వసతి.

4) రాజ పోషకులు : Rs. 10,116/- 1 సం॥లో 3 రోజుల రూము వసతి.

5) పోషకులు : Rs. 5,116/- 1 సం॥లో 2 రోజుల రూము వసతి.

6) లాకర్ : Rs. 1,516/- దోనరు పేరు లాకరు మీద వ్రాయబడును.

ఈ విరాళములు ఇన్కంట్యాక్సు సెక్షను (80G) క్రింద వరుమానపు పన్ను మినహాయింపు కలదు.

ఛైర్మన్ -

ఫౌండరు & మేనేజింగ్ ట్రస్టీ

భక్తశిఖామణి శ్రీ R.R. నాథం

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జీ.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్ బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**

Phones : 42729. 42730. 42731. Resi : 42732. Fax : 42730. STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

Manufacturers of : DEOILD CAKES & SOLVENT
EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)**

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)**

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి దాని రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాత పేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**

**1969**



**సంపుటి**

**29**



**సంచిక**

**10**



**జూన్ - 1998**



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

'సమాజసేవానిష్ణాత'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025.




# ఆంధ్ర సాహిత్య చరిత్రలో అమరుడు ఆరుద్ర

కవిత్వాన్నీ, పరిశోధనసూ అవిశ్రాంతంగా సాగించిన అపరసవ్యసాచి ఆరుద్ర

ఆరుద్ర కవి, పరిశోధకుడేకాదు గొప్ప పండితుడు. సాంప్రదాయసాహిత్యాన్ని వంటపట్టించుకొన్నవాడు అందుకే ఆయన రచనల్లో చక్కని నుడికారపు సొంపులూ, మంచి పదబంధాలూ సాక్షాత్కరిస్తాయి. ఆయనకు అత్యంత ప్రియమైన అంత్యప్రాసను పోషించేందుకు ఆయన వంటపట్టించుకొన్న సాంప్రదాయసాహిత్యం ఎంతగానో తోడ్పడింది

అభ్యుదయ కవితాయుగము శ్రీశ్రీతో ప్రారంభమైనా ఆ తర్వాతస్థానం ఆరుద్రదే ఆరుద్రగారి 'త్వమేవాహం' సాంప్రదాయవాది పుట్టపర్తినారాయణాచార్యులు, విప్లవ కవులు శ్రీశ్రీగారి ప్రశంసలనూ అందుకొంది. "త్వమే వాహం' తెలంగాణాసాయుధపోరాటం నేపథ్యంగా గల రచన - ఈ త్వమేవాహాన్ని ఆరుద్ర కంఠముతోనే విన్న శ్రీశ్రీ గారు "ఇక నేను పద్యాలు వ్రాయకపోయినా ఫరవా లేదంటూ కితాబు ఇచ్చారు"

ఆరుద్రగారి అతి ప్రసిద్ధి పొందిన రచన కూనలమ్మ పదాలు - ఈ రచన సమకాలీన కవులపై మంచి ప్రభావాన్ని చూపింది సుప్రసిద్ధ కవయిత్రి స్వర్గీయ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు ఓ కన్యకమ్మా! అంటూ మాత్రా ఛందస్సులో పదాలు వ్రాశారు. ఆరుద్రగారు కూనలమ్మా అంటే లక్ష్మీకాంతమ్మగారు కన్యకమ్మా అంటారు పద్యం చివర్లో

కవికి ముఖ్యంగా కావలసింది సమయస్ఫూర్తి, అతి తక్కువ అక్షరాలతో. అతి ఎక్కువ అర్థాన్ని చెప్పే శక్తి. సాంప్రదాయ సాహిత్యాన్నీ, అభ్యుదయ సాహిత్యాన్నీ పుష్టిగా వంటపట్టించుకొన్న ఆరుద్రగారికి పై రెండింటికీ లోటు ఉండదు. "ముత్యమంతా పసుపు ముఖమంత

ఛాయ ముత్తైదు కుంకుమ బ్రతుకంతఛాయ" అంటూ 'అంత' అను రెండక్షరాలతో అనంతమైన అర్థాన్ని, భావ గాంభీర్యాన్ని, మాధుర్యాన్ని ఆరుద్రగారు సాధించారు

జ్ఞానపీఠపురస్కారగ్రహీత డాక్టర్ నారాయణరెడ్డిగారు 'అంత' కడపడిపాలపై 'ఒక్కింత' మీగడపేరునట్లుగ - అంటూ మనకు మిగిలేది గతములోపలి మంచి ఒక్కటే అని గొప్ప అర్థాన్ని, ఆదర్శాన్ని చెప్పారు

ఆరుద్రగారికి అంత్యప్రాసల మీద సహజంగా గల మక్కువ చలనచిత్ర గీతాలను వ్రాయడానికి బాగా తోడ్పడింది - పదానికైనా, గేయానికైనా అంత్యప్రాస మాధుర్యాన్ని సమకూర్చుతుంది

అన్యభాషాపదాలను తనలో ఇముడ్చుకోవడములో తెలుగుబాషకు ఉన్నశక్తి సాటిలేనిది ఆరుద్రగారు అన్య భాషాపదాలను చేర్చి కవితలల్లి తెలుగుభాషకు గల ఆ విశిష్టతను ప్రపంచానికి చూపించారు

1925 ఆగస్టు 13న ఆరుద్రగారు విశాఖపట్నములో జన్మించారు భాగవతుల శంకరశాస్త్రి ఆయన పేరు. శ్రీశ్రీకి మేనల్లుడు

ఆరుద్ర భారతస్వాతంత్ర్యసమరయోధుడు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని కారాగారవాసశిక్షను అనుభవించాడు. చా సో గారి ప్రోత్సాహముతో ఎర్రజెండా క్రిందచేరారు. 1950, 1960 దశాబ్దాలలో ఆయన మంచి ఉచ్ఛస్థితిలో ఉన్నారు అభ్యుదయసాహిత్యాకాశములోనూ, చలనచిత్ర విహాయసవీధిలోనూ ఒక ఉజ్జ్వలతారగా వెలిగారు. • అప్పుడే భాగవతులశంకరశాస్త్రి ఆరుద్రగా మారింది. ఆరుద్ర ఇరవైఏడు నక్షత్రాలలో ఒకటి. ఈ నక్షత్రము వినీలాకాశంలో లేత ఎరుపు రంగుతో కన్పిస్తూంది తనకు కమ్యూనిజంపై అభిమానం ఎక్కువైనందుకు గుర్తుగా 'ఆరుద్ర' అనిపెట్టుకొన్నారని కొందరు భావిస్తారు

ఆంధ్రసాహిత్యసాగరాన్ని ఒక్కడుగా మథించి, ఔపాసన పట్టిన అపరభగీరథుడు ఆరుద్ర. సమగ్రఆంధ్రసాహిత్యము, అను పేరుతో పదమూడు సంపుటాలుగా ఆంధ్ర సాహిత్యచరిత్రను రచించాడు. ఆ పదమూడు సంపుటాలు ఆయన సాహిత్యపరిశోధనకే కాక ఆయన సాహిత్యసేవకే మణిమకుటాలు. కాలంతోపాటు పెరిగిన శాస్త్రీయ దృక్పథంతో, అవగాహనతో తెలుగు సాహిత్యపరిణామ దశలను ఆ సంపుటాలలో విశ్లేషించారు. వివరించారు. ఇప్పటివరకూ వెలువడిన సాహిత్య చరిత్రా గ్రంథాలన్నింటిలో మిన్న, వీరి సమగ్రాంధ్రసాహిత్యము.

ఆచార్య రోణంకి అప్పలస్వామి శిష్యరికమూ, చాగంటిసోమయాజుల (చా సో) సహవాసమూ, నారాయణబాబు, పరాంభి కవితల ప్రభావమూ ఆరుద్రగారిని అక్షరమోజుల్లో పడేశాయి. ఆ తరువాత ఆయన సాహితీప్రస్థానములో తిరిగిన మలుపులూ, చేసిన విన్యాసాలు అనేకం.

ఆరుద్ర కట్టుబాట్లకు దూరమైనా, అక్షరానికి దూరం కాలేదు. అందుకే ఆరుద్ర అక్షర ప్రపంచములో అమరుడు

వైశ్యప్రబోధిని, జూన్ 1998

చాలామంది ఆరుద్రలో అభ్యుదయవాదినే చూస్తారు ఆయనలోని ఆధ్యాత్మిక దృక్పథాన్ని గమనించలేరు. ఆర్ద్రమైన భావన ఉన్నప్పుడే సగటు మానవుని ఉద్ధరణకు కృషిచేయాలనిపిస్తుంది.

ఆయన కవితల్లోనూ, ఆయన ఆవేదనలోనూ సగటు మనిషిమీద జాలి, కరుణ, వారి సముద్ధరణకు కృషి చేయాల్సిన ఆవశ్యకత కన్పిస్తుంది "కధునాలవాల ఇదినీదులీల" అను చిత్రగీతము ఆయనలోని ఆధ్యాత్మిక దృక్పధానికి సాక్ష్యమైతే, "అందాల రాముడు - ఇందీవరశ్యాముడు" మొదలగు ఆయన వ్రాసిన భక్తిపూర్వక గీతాలు ఆయనలోని భక్తిభావనను వెల్లడి చేస్తాయి

జానపదజావళీలు, సినిమా పాటలు, ఇంద్రజాలం, చదరంగం, గళ్ళనుడికట్టు, స్థలనామాలు శాసనపరిశోధన, ఆంత్రోపాలజి, చరిత్ర, ఇంటింటిపద్యాలు ఇత్యాది రచనలు పండిత పామరజనాల జీవితాలచుట్టూ తిరిగేవి.

కవి - పండితుడు - పరిశోధకుడు ఆరుద్ర 4-6-1998న మరణించాడు ఆయనలేని లోటు ఆంధ్రసాహిత్యచరిత్రకు తీరని లోటు ఆయనకు మా నివాళి

---

**అభాగ్య వైశ్యసోదర సహాయనిధి** (రిజిష్టరు)

వైశ్యప్రబోధినీ కార్యాలయం

7/512-1, జయనగర్ కాలనీ, కడప - 516 002.

**1-4-1997 నుండీ 31-3-1998 వరకు అందించిన ఆర్థిక సహాయము**

| | రూ. పై. |
|---|---|
| యస్.పి. రంగయ్య, అనంతపురం | 1000.00 |
| ఎ. మురళీమోహనగుప్త, గుంటూరు. | 200.00 |
| ఆర్. శ్రీనివాసరావు, గుంటూరు. | 500.00 |
| జి. సుబ్బరావు, వరంగల్ | 500.00 |
| వై. నాగరాజ, విశాఖపట్నం | 500.00 |
| మొత్తం | 2700.00 |

1-4-1997 నుండి 31-3-1998 వరకు

| జమలు | రూ. పై. | ఖర్చులు | రూ. పై. |
|---|---|---|---|
| ప్రారంభ నిల్వ | 19,498.45 | విద్యార్థులకు ఆర్థికసహాయము | 2,700.00 |
| ఆంధ్రాబ్యాంకి | 645.45 | పోస్టేజి + యం.ఒ. కమీషన్ | 145.00 |
| వడ్డీఖాతా | 3,362.50 | ఆంధ్రాబ్యాంకి ఖాతా | 677.45 |
| | | నగదు | 19,983 95 |
| మొత్తం | 23,506.40 | మొత్తం | 23,506.40 |

# దేశ ఉన్నతికి వైశ్యుల కృషి

- శ్రీ కె.సి. గుప్త, హైద్రాబాద్

## (స్వాతంత్ర్యానికి ముందు మరియు స్వాతంత్ర్యం తర్వాత)

పూర్వకాలములోనే ప్రజలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్గములుగా విభజింపబడిరి. వైశ్యులు కృషి, వాణిజ్యము, గోసంరక్షణ విధులను స్వీకరించి ప్రముఖ పాత్ర వహించి ప్రజాసేవ చేస్తూ పరిపాలన సక్రమముగా జరుపుటకు తోడ్పడినారు.

వైశ్యులు భారతదేశములో 100 పేర్లతో పిలువ బడుచున్నారు. వైశ్యులనగా దక్షిణ భారత దేశములో నివసించు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక, తమిళ వైశ్యులు మాత్రమే కాదు. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు ప్రతి రాష్ట్రములోను వైశ్యులు కలరు. వారి భాష, ఆచార వ్యవహారములు వేరువేరుగా నున్నను దేశములో వైశ్యులంతా ఒకటే. భారతదేశములో ఎనిమిది కోట్లమంది వైశ్యులు కలరు. మరియు ఐదువేల వైశ్యసంఘాలు, సంస్థలు కలవు. ఇవన్నీ వైశ్యులకే కాక వైశ్యేతరులకు కూడ సేవ చేయుచున్నవి. వైశ్యులు భుక్తి కొరకు వ్యాపారము చేసుకొని మాత్రమే బ్రతుకడము లేదు. అన్ని రంగాలలో తోటి పౌరులతో సమానముగా ముందంజ వేసి దేశానికి సేవ చేయుచున్నారు. దేశానికి స్వాతంత్ర్యము తెచ్చిన మహాత్మాగాంధి వైశ్యుడే. ఆంధ్రులకు రాష్ట్రాన్ని సంపాదించి పెట్టడమే కాక దేశములో భాషాప్రయుక్త రాష్ట్రముల ఏర్పాటుకు కృషి చేసిన అమరజీవి పొట్టి శ్రీరాములు మొదలగు వారంతా వైశ్యులే.

ఈనాడే కాదు. రెండు వేల సంవత్సరాల పూర్వము క్రీస్తుశకము మొదటి, రెండు శతాబ్దములలో వైశ్యులు అహిచ్ఛేత్రము, అయోధ్య, కౌశంబి, మధుర మొదలగు ప్రదేశాలలో సుమారు వందమంది రాజులు పరిపాలన చేసినారు. యౌధేయులు అను వైశ్యులు రిపబ్లిక్ అనగా రాజులేని రాజ్యమును ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులచే ప్రభుత్వము నడిపి రెండువేల సంవత్సరాలకు పూర్వమే చూపినారు. పద్నాలుగవ శతాబ్దములో 'అయివోలు' అను ప్రదేశములో వైశ్యులు కర్నాటకలో పరిపాలనచేసినారు. పదకొండవ శతాబ్దములో పెనుగొండపట్టణమును కుసుమశ్రేష్ఠి పరిపాలించినాడు. ఐదువేల సంవత్సరాలకు పూర్వము అగ్రసేన్ మహారాజు అను అగ్రవాల్ వైశ్యులు ఢిల్లీకి వంద మైళ్ళ సమీపాన అగ్రోరా అను రాజ్యాన్ని స్థాపించి పరిపాలించినారు. వేదకాలములో పదమూడు మంది రాజులు పరిపాలన చేసినారు. పద్దెనిమ్మిది మంది వైశ్యులు చక్రవర్తులుగా నుండి దేశాన్ని ఏలినారు. రాజుల కాలములో మంత్రి ఒకడే ఉండేవారు. అనేక మంది మంత్రులు చక్కని పరిపాలన చేసి, పేరుపొందినారు.

జైనమతము, బుద్ధమతం వ్యాప్తికి అనేకమంది వైశ్యులు పీఠాధిపతులు, మఠాధిపతులుగా నుండి దేశములో మరియు విదేశాలలో ఈ మతాలను విస్తరింప చేసినారు. అనేక మంది కవులు, పండితులు ఉండిరి. ఆచార్య హేమచంద్రసూరి సంస్కృతములో 28 కావ్యాలతో లక్షల శ్లోకాలు వ్రాసి గొప్ప

సాహిత్యకృషి చేసినారు. హిందీ సారస్వతములో మైతిలి శరణ్‌గుప్త, శియారాం చరణ్‌గుప్త మొదలగు అనేక మంది పండితులు కన్పిస్తారు. ఈ విధంగానే రాష్ట్రాలలో కవులు, పండితులు ఉన్నారు.

దేశ స్వాతంత్ర్యము కొరకు గాంధీ గారి పిలుపు ననుసరించి వేలమంది వైశ్యులు అన్ని రాష్ట్రాలలో స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని జైలుకు వెళ్ళినారు. స్వాతంత్ర్యము లభించిన పిదప వైశ్యులు అన్ని రాష్ట్రాలలో శాసనసభ్యులుగాను మరియు రాజ్యసభ, లోక్‌సభ సభ్యులుగా ఎన్నుకోబడినారు. రాష్ట్రములలో మంత్రులుగా నియమింపబడినారు. వైశ్యులు గవర్నరులుగా, కేంద్రమంత్రులుగా, హైకోర్టులలో, సుప్రీం కోర్టులలో న్యాయమూర్తులుగా, వైస్ ఛాన్సలర్లుగా మరియు అనేక ఉన్నత పదవులలో ఉండి సేవ చేయుచున్నారు.

## మాకం నాగరాజుకు మాతృవియోగం

కడపజిల్లా ప్రొద్దుటూరు వైశ్యప్రముఖులు శ్రీ మాకంనాగరాజుగారి తల్లి శ్రీమతి. మాకంసుబ్బలక్ష్మమ్మగారు 23-5-1998వ తేదీన స్వర్గస్తులయ్యారు.

## కృతజ్ఞతాభివందనాలు

ఆర్యా!

చాలాకాలం నుండీ వైశ్యప్రబోధినీ పత్రికను, క్రమం తప్పకుండా పంపుచున్నందులకు మీకు నా కృతజ్ఞతాభివందనాలు.

డి. చలపతిరావు.

ఆధ్యాత్మికజ్ఞానపీఠంఅధ్యక్షులు

చిలకలూరిపేట. 27-4-98

## మేము చేసింది చాలా తక్కువ

సోదరా!

మీరు దయతో పంపిన వైశ్యప్రబోధిని మే 1998 సంచికలో వైశ్య స్వాతంత్ర్య సమరయోధుల విజ్ఞప్తిని ముద్రించినందులకు అభివందనములను తెలుపుచున్నాను. ఈ జూన్‌నెల ఆఖరులోగా వందరూపాయలు మణియార్డరు ద్వారా పంపుతాను.

ఈ సంచికలో రాష్ట్రవైశ్యసంస్థల సమాఖ్య మీకు బిరుదు ఇచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని "రాష్ట్రవైశ్యసంస్థల సమాఖ్యకు సహస్రవందనాలు" అని మీ అబ్బాయిలు చెప్పిన కృతజ్ఞతలు ప్రచురించారు. మేము మీకు చేసింది చాలా తక్కువ. అయినా మా సంస్థను గురించి మీరు ఇంతగా ప్రచారం చేసినందులకు అభివందనములు తెలుపుచున్నాను.

కె.సి. గుప్త

ఫౌండర్, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య

హైద్రాబాద్. 25-5-1998

శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారికి
కడప.

ఆర్యా! వందనములు

ఈ నెలలో మీకు 'సమాజసేవా నిష్ణాత' అను బిరుదప్రదానముతో, షష్టిపూర్తి ఉత్సవములు ఘనముగా జరిగినందులకు, హృదయపూర్వక అభివందనాలు అర్పిస్తున్నాను.

భవదీయ

చుండూరి అప్పారావు

రావెల.

గుంటూరుజిల్లా, 27-5-98

# శ్రీ వాసవీ కన్యకాపురాణము

మూలం : వ్యాసప్రణీత స్కాంధపురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

(గతసంచిక తరువాయి)

పై విధముగా పలికి ఆదిశక్తి కన్యకా పరమేశ్వరి అంతర్ధానమయ్యెను. జను లంతా వాసవి వైపు చూచిరి. వారికి ఆమె ముఖములో ఒక దివ్యమైన తేజస్సు కనిపించెను. చూడచూడగా ఆ కాంతికోటి సూర్యుల కాంతిగా మారెను. శాంతము, గాంభీర్యము ఆ ముఖములో కన్పించెను. చివరకు ఆ దివ్య తేజస్సును తిలకించు టకు వారికి సాధ్యము కాకపోయెను. భక్తి పూరితమై ఒక పవిత్రమైన భావన వారిలో కలిగెను. వారంతా చేతులు ఎత్తి వాసవికి నమస్కరించిరి. భాస్కరాచార్యుడు అమెను చూచి సాష్టాంగముగా ప్రణ మిల్లెను. ప్రజలంతా అట్లే ప్రణమిల్లిరి. అంత జయహో వాసవి! అను శబ్దము మిన్ను ముట్టెను. వారందరికీ నమస్కరించి, వాసవి అగ్నిలో దూకెను. పిదప కుసుమ గుప్తుడు, తదుపరి కుసుమాంబ, తరువాత మిగిలిన వారలూ అగ్నిలో కురికిరి. జగ దంబ అనతి దాటుటకు శక్తుడు కాని, ఆ అగ్నిహోత్రుడు ఆ సాధుజీవులను దహించు టకు ఇష్టము లేకనే దహించెను. దివి నుండీ దేవతలు పుష్పవృష్టిని కురిపించిరి. వారందరికీ మోక్షము లభించెను.

వాసవిని బలవంతముగా తీసుక పోవా లన్న ఉద్దేశ్యముతో చతురంగ బలములతో వచ్చిన విష్ణువర్ధనుడు పెనుగొండను చేరెను. పెనుగొండ నగరి వాకిటికి వచ్చిన వెంటనే అతడు ఈ ఆత్మార్పణ విష యమును వినెను. అతనికి గత జన్మమూ - ఆదిశక్తి ఇచ్చిన శాపమూ గుర్తుకు వచ్చెను. ఆతని ప్రాణములు అనంత వాయువులలో కలిసెను.

విరూపాక్షాది బాలనగరులు ఆత్మార్పణ చేసిన వారందరికీ శ్రాద్ధ కర్మలు చేసిరి. అగ్ని కుండముల నుండీ సేకరించిన అస్తికలను పవిత్ర ద్రాక్షారామము వద్ద గోదావరిలో నిమజ్జనము చేసిరి.

పెనుగొండ రాజ్యమునకు విరూ పాక్షుడు రాజుగా పట్టాభిషక్తుడయ్యెను. తండ్రి వలెనే ప్రజలను పాలించెను. నెలకు మూడు వానలూ కురియగా, భూదేవి సంపూర్ణంగా కరుణించి పంటలు ఇవ్వగా, పాడి పొర్లి పొరగా, పాడి దప్పని ప్రభువుగా విరూపాక్షుడు చరిత్రలో నిలిచి పోయెను.

ఇది స్కాంధ పురాణమందు - సనత్సు జాతీయ సంహితగల ఉత్తర ఖండము - వాసవీ అవతార ఉపసంహరణ - 18వ ఆశ్వాసము.

పురాణం సంపూర్ణం. ప్రవరలు - గోత్రములు మరు సంచికలో

# మహాభారతంలో ధర్మసూక్ష్మాలు

**శ్రీదేవిశెట్టి చలపతిరావు,** B.Sc., (Ag.)
వ్యవస్థాపకులు, ఆధ్యాత్మికజ్ఞానపీఠం, చిలకలూరిపేట

ఈ వ్యాస రచయిత శ్రీదేవిశెట్టి చలపతి రావుగారు చిలకలూరి పేట వాస్తవ్యులు. వీరు వ్యవసాయ శాస్త్రపట్టభద్రులు. చిన్నతనం నుండి వీరికి రామాయణ, భారత, భాగవతాలపై అనక్తి మెండు. ప్రత్యేకంగా మహాభారతంపై వీరు చక్కని పరిశోధన గావించుటేగాక చిలకలూరిపేటలో 1988 నుండి 1993 వరకు సుమారు 5 సంవత్సరాల పాటు మహాభారతంపై ధారావాహిక ప్రవచనములు చేశారు. అవోపా, రోటరీక్లబ్, లయన్స్‌క్లబ్ మొదలగు సంస్థల ఆహ్వానంపై అనేక గ్రామాలలో, పట్టణాలలో మహాభారతంపై ఉపన్యాసములు ఇవ్వటం జరిగింది.

1990 నుండి వీరు చిన్మయామిషన్ కార్యదర్శిగా ఉండి అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను నిర్వహించారు. వీరు 1990 నుండి ఒక ఆధ్యాత్మిక సత్సంగమును నిర్వహిస్తూ అందు భగవద్గీత, భజగోవిందం, తత్త్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, ఈశ, కేన, కైవల్య, ముండక మొదలగు ఉపనిషత్ గ్రంథాలపై ప్రవచనములు ఇస్తూ శిష్యవర్గాన్ని తయారు చేశారు.

1994లో 'ఆధ్యాత్మికజ్ఞానపీఠం' అనే ఒక ఆధ్యాత్మిక సంస్థను స్థాపించి అనేక కార్యక్రమాలను నిర్వహిస్తూ ఇప్పటివరకు 24 ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞాలు చేశారు. ఈ జ్ఞానయజ్ఞములందు భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాంతప్రకరణగ్రంథాలపై ప్రవచనములు చేస్తూ ఆధ్యాత్మికజ్ఞానాన్ని ప్రజలకు అందిస్తున్నారు ఈ సంవత్సరం మార్చి 8న విజయవాడ థర్మల్‌పవర్‌స్టేషన్ (VTPS) A కాలనీయందు 108 హోమ గుండాలతో వాసుదేవమహాయజ్ఞాన్ని నిర్వహించారు. వీరు 'కర్మసిద్ధాంతం' అనే వేదాంతగ్రంథాన్ని రచించి ప్రచురణ చేయించారు.

మహాభారతంపై సామాన్య ప్రజలలో గల అపోహలను, సందేహాలను తొలగించుటకై ప్రస్తుతం వీరు 'మహాభారతంలో ధర్మసూక్ష్మాలు' అనే శీర్షికను ధారావాహికంగా ఈ పత్రికలో కొనసాగించబోతున్నారు. మహా భారతంపై ఎవరికైనా సందేహాలు ఏవైనా ఉన్నట్లైతే రచయితకు వ్రాసినట్లైతే 'వైశ్య ప్రబోధిని' ద్వారా మీ సందేహాలకు సమాధానం ఇవ్వటం జరుగుతుంది."

ప్రశ్న : మహాభారతగంథ్రంపై మీరు బాగా కృషిచేశారు గదా? మహాభారతం మానవ జాతికి ఇచ్చే సందేశం ఏమైనా ఉన్నదా?

జవాబు : తప్పకుండా ఉన్నదండి. "మహాభారతం మానవ జీవిత మహేతిహాసం' ఇది అన్ని యుగాలకు, అన్ని కాలాలకు, అన్ని దేశాలకు, సమస్త మానవాళికి తగినటువంటి మహోన్నతమైన సందేశాన్ని ఇస్తున్నది. "ధర్మానికి అధర్మానికి సంఘర్షణ

జరిగినప్పుడు ధర్మం ఎంత బలం తక్కువదే ఐనప్పటికీ - అధర్మం ఎంత బలం కలిగినదే అయినప్పటికీ - చివరకు ధర్మమే జయిస్తుందని - అందువల్ల ప్రతి మానవుడు ధర్మమార్గంలో నడిచి తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి" అంటూంది మహాభారతం.

ప్రశ్న : 'ధర్మమే చివరకు జయిస్తుంది' అని అంటున్నారు కనుక మహాభారత యుద్ధంలో జయించిన పాండవులు ధర్మాత్ములని, ఓడిన కౌరవులు అధర్మ పరులని మీ అభిప్రాయమా? మరి లోకంలో కొందరు దీనికి వ్యతిరేకంగా కూడా చెబుతుంటారు గదా? పాండవులే అధర్మ పరులు అంటారు గదా?

జవాబు : మహాభారతగ్రంధాన్ని సంపూర్ణంగాను, జాగ్రత్తగాను అధ్యయనం చేసి, అవగాహన చేసుకున్న వారెవరైనా పాండవులు ధర్మాత్ములనే అంగీకరించక తప్పదు. పూర్తిగా అవగాహన చేసుకోలేని వారు, గ్రంథాన్ని అసలు చదవనివారు లేదా పూర్తిగా చదవనివారు మాత్రమే అలా పాండవులు అధర్మపరులు అంటారు. అంతేగాక - కొందరు అవునన్నదాన్ని కాదని, కాదన్న దానిని ఔనని వాదించే మనస్తత్వం కలిగి ఉంటారు. అట్టివారు కూడా ఇలా వ్యతిరేకంగా వాదించి తమకొక ప్రత్యేకతను ఆపాదించుకొంటూ ఉంటారు. మన ఆలోచనలు, ఆశలు, ఆశయాలు, అభిప్రాయాలు ఎన్నో ఉన్నప్పటికీ అసలు మహాభారత గ్రంథాన్ని మనకందించిన వేద వ్యాసుల వారి అభిప్రాయం తెలుసుకోవటం ఎంతైనా అవసరం. ఎందుకంటే మహాభారతం జరిగేటప్పుడు మీరులేరు. నేనూ లేను. అప్పుడు ప్రత్యేకంగా ఉన్నవాడు, ఆ కథలో పాత్రధారి, అందరి విషయాలు తెలిసినవాడు, అందరి గురించి సరిగ్గా చెప్పగలిగినవాడు, జరిగిన కథను మన కందించినవాడు ఆయనే గనుక ఆయన అభిప్రాయమే సర్వాంగీకారం కావాలి.

ఆయన గ్రంథ ప్రారంభంలోనే అనుక్రమణికాధ్యాయంలో కురు, పాండవ పక్షాలను రెండు శ్లోకాల్లో వర్ణించి ఎవరు ఎలాంటి వారో స్పష్టంగా తెలియజేశారు.

శ్లో॥ దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః
స్కంధః కర్ణః శకునిస్తస్యశాఖాః !
దుశ్శాసనః పుష్ప ఫలే సమృద్ధే
మూలం రాజా ధృతరాష్ట్రో మనీషీ !!
(110 శ్లో)

దుర్యోధనుడు క్రోధమయమైన మహా వృక్షం. దానియొక్క స్కంధ (మాను) కర్ణుడు; శాఖ (కొమ్మ) శకుని; దుశ్శాసనాదులు దానియొక్క పుష్పములు, ఫలములు. ఇక దానియొక్క మూలం అజ్ఞానియైన ధృతరాష్ట్ర మహారాజు.

ఇలా కౌరవ పక్షాన్ని వర్ణించిన వ్యాస మహర్షి పాండవ పక్షాన్ని ఏమని వర్ణించాడో చూడండి.

శ్లో॥ యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కంధోర్జునో భీమసేనో స్యశాఖా
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మాచ బ్రాహ్మణాశ్చ!!
(111 శ్లో)

యుధిష్ఠిరుడు (ధర్మరాజు) ధర్మమయమైన మహావృక్షం. దాని యొక్క స్కంధం

అర్జునుడు; శాఖభీమసేనుడు, నకుల సహదేవులు పుష్పములు, ఫలములు; ఇకదాని మూలం శ్రీకృష్ణుడు, వేదములు, బ్రాహ్మణులు.

దీనిని బట్టి కౌరవుల్లు అధర్మపరులని, పాండవులు ధర్మాత్ములని వ్యాసమహర్షి యొక్క స్పష్టమైన అభిప్రాయం అని తేలిపోతున్నది. మహాభారత గ్రంథ తాత్ప ర్యాన్ని సూచించే పై రెండు శ్లోకాలు వ్యాసమహర్షి యొక్క హృదయం అని స్పష్టమౌతున్నది. తన గ్రంథంలోని పాత్రల స్వభావం ఆయనకుగాక మరొకరికి స్పష్టంగా ఎలా తెలుస్తుంది? మరి వ్యతి రేకంగా మాట్లాడే వారి అభిప్రాయాలు సరైనవని ఎలా అనుకుంటాం?

ప్రశ్న : పాండవులు ధర్మాత్ములని వ్యాసమహర్షి అభిప్రాయం అన్నారు, బాగానే ఉంది. ఐతే వేమనలాంటి మహాకవి కూడా "పేరు ధర్మరాజు పెదవేప విత్తయా విశ్వదాభి రామ వినురవేమా!" అని ఒక పద్యంలో ధర్మరాజును తప్పుబట్టారు గదా! మరి వేమనగారు మహాభారతాన్ని, వ్యాసులవారి అభిప్రాయాన్ని చక్కగా అవగాహన చేసుకో లేక ఇలా వ్రాశాడంటారా? ఏదో ఆషా మాషీగా వ్రాశాడంటారా? లేక ఆ పద్యం అసలు వేమనగారిది కాదు - ప్రక్షిప్తం అంటారా?

జవాబు : ఆ పద్యం వేమనగారిదే. ప్రక్షిప్తం అని, మనకు వ్యతిరేకంగా ఉన్నవానిని కొట్టి పారేసే విధానం మంచిదికాదు. ఆయన ఆషామాషీగా వ్రాసిన కవి కూడా కాదు. ఆయన మహాయోగి. ఆయన పలుకులు నిత్య స్మరణీయములు. ఆయన మహాభారతాన్ని, వ్యాసులవారి అభిప్రాయాన్ని చక్కగానే అవగాహన చేసుకున్నారు. ఎటొచ్చీ వచ్చిన చిక్కేమి టంటే ఆ వేమనగారి పద్యాలను అన్నింటిని చదవకపోవటం, ఆయన అభిప్రాయాన్ని మనం సరిగ్గా అవగాహన చేసికోలేక పోవటం ప్రస్తుత దురభిప్రాయానికి కారణం.

మీరు చెప్పిన 'పేరు ధర్మరాజు పేద వేపవిత్తయా' అనే పద్యంలోని 'ధర్మరాజు పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు గురించేనని మనం భావించటమే అసలు పొరపాటు.

ఎందువల్ల పొరపాటో చూడండి.

ధర్మమరసి పూని ధర్మరాజాదులు
నిర్మలంపుకీర్తి నిలుపుకొనిరి
ధర్మమేనృపులకు తారకయోగంబు
విశ్వదాభిరామ వినురవేమ ॥

ఇదీ వేమనగారి పద్యమే. ధర్మాన్ని తెలుసుకొని, దానిని ఆచరించి ధర్మరాజు మొదలైనవారు నిర్మలమైన కీర్తిని నిలుపు కున్నారు. రాజులకు ధర్మమే తారక యోగము - అని వేమనగారు ధర్మరాజును ధర్మాత్ముడని ప్రశంసించాడు. ఏ వేమన కవి ధర్మరాజును ధర్మాత్ముడని ప్రశం సించాడో ఆ వేమన కవియే మరొక పద్యంలో ధర్మరాజును వేపవిత్తు అని ఎలా నిరసిస్తాడు? స్వవచన వ్యాఘాతాలకు పాల్పడే కవియా ఆయన? ఇదే మనం ఆలోచించాల్సింది.

ఇంతకూ ఈ రెండు పద్యాలలో ఒకటి అసలు ధర్మరాజును గూర్చి, మరొకటి పేరు

మాత్రం ధర్మరాజు అని పెట్టుకొని అధర్మ కార్యాలు నిర్వర్తించే సామాన్యుని గురించి అసలు ధర్మరాజునేమో "ధర్మ మరసిపూని ధర్మరాజాదులు" అని వేమన కవి ప్రశం సించాడు ఇక పేరు మాత్రం ధర్మరాజు అని పెట్టుకొని అదర్మకార్యాలు నిర్వర్తించే సామాన్యునేమో "పేరు ధర్మరాజు పెదవేప విత్తయా" అని నిందించాడు. పేరు పెట్టుకొన్నంత మాత్రాన ధర్మరాజులా ధర్మంగా నడుచుకోవటం సామాన్యునికి చాలా కష్టసాధ్యం అని చెప్పటమే ఇందలి రహస్యం.

వేమనకవి అభిప్రాయంపై ఇంకా అనుమానాలున్నవారికి ఇంకొక వేమన పద్యాన్ని మనవి చేస్తున్నాను.

రాముడొకడు పుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులము జెరిచె
నిలను పాపపుణ్య మీలాగు గాదొకో
విశ్వదాభిరామ వినురవేమ.

ధర్మరాజును ధర్మాత్ముడని చెప్పటమే కాదు, ధుర్యోధనుడు కులనాశనకారి యని గూడ వేమన కవి తెలియజేశాడు. కనుక వేమనకవి మహాభారతాన్ని, వ్యాసులవారి అభిప్రాయాన్ని చక్కగా అవగాహన చేసుకున్నవారే. వేమన కవి వ్రాసిన "పేరు ధర్మరాజు.........." అనే పద్యంలోని ధర్మ రాజు మన ధర్మరాజు కాదు. పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు కాదు. మన ధర్మరాజు ధర్మాత్ముడే. ధుర్యోధనుడు కులవినాశన కారియే. వేమన అభిప్రాయములో దోషం లేదు. మనం అర్థం చేసుకోవటంలోనే దోషం అంతా.

ప్రశ్న : పాండవులు ధర్మాత్ములు, కౌరవులు అధర్మపరులు అంటున్నారు గదా! కౌరవులు చేసిన అధర్మాలేమిటో సంక్షిప్తంగా తెలియజేస్తారా?

జవాబు : పరుల రాజ్యం హరించాలను కోవటమే కౌరవులు చేసిన అధర్మం. వారు చేసిన అకార్యాలు.

(1) తమచేత చిక్కిన పాండవ రాజ్యాన్ని మరల ఆ పాండవ పుత్రులకు దక్కకుండా చేయటానికి ఆ పాండవులనే తుద ముట్టించాలని చిన్నతనంలోనే ప్రయత్నాలు ప్రారంభించారు. అందుకోసం పాండవు ల

గించు కొనుటకు విషాన్నం బెట్టించారు పాములచేత కరిపించారు . గంగలో త్రోయించారు.

(2) కుమారాస్త్ర విద్యా ప్రదర్శనానంతరం పాండవులను కుంతీదేవితో సహా వారణావ తానికి పంపి అక్కడ లక్కఇంట దగ్ధం చేయతలపెట్టారు.

(3) ధర్మజ రాజసూయానంతరం పాండ వుల సంపదకు కన్నుకుట్టిన ధుర్యోధనుడ ఎలాగైనా వారి సంపదను హరించాలని భావించి శకునిచేత కపటజూదం ఆడించి వారి రాజ్యాన్ని కాజేశారు. అంతటితో ఆగక సభ్యసమాజం తలవంచుకొనే రీతిలో పూజ్యులైన గురువులు, పెద్దలు అనేకు లున్న సభలోనికి పాండవ పట్టమహిషి ద్రౌపదీదేవిని ఈడ్చుకొని వచ్చి వస్త్రాప హరణం చేశారు.

(4) పాండవులను అరణ్యాలకు పంపి అక్కడ వారు సుఖంగా ఉంటున్నారని

తెలుసుకొని వారిని ఎలాగైనా అవమానించాలని భావించి ఘోషయాత్రా నెపంతో అరణ్యాలలో పాండవులున్న ప్రాంతానికి వెళ్ళారు.

(5) ద్యూతనియమ ప్రకారం అరణ్య అజ్ఞాత వాసములను పూర్తిగావించుకొని తిరిగి వచ్చిన పాండవులకు వారి రాజ్యం వారికివ్వటానికి నిరాకరించి సూదిమొన మోపినంత నేలనైనను ఇచ్చేది లేదు, చేతనైతే యుద్ధంలో జయించి తీసుకోవచ్చు అని యుద్ధానికి సిద్ధపడ్డారు.

(6) కౌరవ పాండవుల మధ్య సంధికై వచ్చిన శ్రీకృష్ణుని బంధించ ప్రయత్నించారు. చివరకు మీకు పౌరుషం గనుకఉంటే మీ మీ ప్రతిజ్ఞలు నెరవేర్చుకోండి అని శకుని పుత్రుడు ఉటాక్షుని రాయబారిగా బంపి పాండవులను రెచ్చగొట్టారు. ఇవి కౌరవులు చేసిన దుర్మార్గాలలో కొన్ని.

ప్రశ్న : అయితే దుర్యోధనుడు పరుల రాజ్యాన్ని హరించాలను కొన్నాడు అంటారు?

జవాబు : అవును. పరస్త్రీని అపహరించి రావణుడు, పరరాజ్యాన్ని అపహరించి దుర్యోధనుడు సర్వనాశనమయ్యారు. ఇదే విషయాన్ని కౌటిల్యుడు తన అర్ధశాస్త్రంలో 'ఇంద్రియజయము' అనే అధ్యాయములో కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాల వల్ల సపరివారసమేతంగా నశించిన వారిని గూర్చి చెబుతూ

"మానాత్ రావణః పరదారా న ప్రచ్ఛయన్

దుర్యోధనో రాజ్యాత్ అంశంచ సబంధు ర్నాష్టో వినాశ ।

అని రావణ, దుర్యోధను లెలా నాశన మయ్యారో తెలియజేశారు.

పాండవుల రాజ్యాన్ని కాజేయాలనే దురుద్దేశమే లేకపోతే భీముని అడ్డుతొలగించుకోవాలనీ, పాండవులందరినీ కుంతీ దేవితో సహా తగల బెట్టాలనీ ఎందుకు ప్రయత్నిస్తారు? రాజ్యం తమదే అయితే ఈ ప్రయత్నాల యొక్క అవసరం ఏముంది?

ప్రశ్న : రాజ్యంపై హక్కు పాండవులదే గాని కౌరవులకు హక్కులేదని గదా మీ అభిప్రాయం. రాజ్యాధికారం ఎక్కడైనా పెద్దవాడికేగాని చిన్నవాడికి ఉండదు గదా! అలాంటపుడు ధృతరాష్ట్రునికి లేని హక్కు పాండురాజుకెలా వచ్చింది? రాజ్యం పాండవులదెలా అవుతుంది?

జవాబు : ధృతరాష్ట్రుడు పెద్దవాడైనప్పటికీ అంధుడు, రాజ్యపట్టాభిషేకమునకు అనర్హుడైనందున చిన్నవాడైన పాండురాజే రాజయ్యాడు. సంస్కృతమూలభారతం ఆదిపర్వం 108వ అధ్యాయంలో 25వ శ్లోకం ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నది. ఇదిగో ఆ శ్లోకం చూడండి.

శ్లో॥ ధృతరాష్ట్రస్త్వ చక్షుష్ట్వాత్ రాజ్యం న

పారశవత్వాద్విదురో రాజాపాండుర్బభూవహ ॥ (25)

ధృతరాష్ట్రుడు అంధుడైనందున, విదురుడు పారశవుడు (బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు జన్మించినవాడు) గనుకను రాజ్యమును పొందలేకపోయినారు. అందువల్ల చిన్నవాడైన పాండురాజే రాజుగా చేయబడెను. పెద్దవాడైనప్పటికీ ధృతరాష్ట్రుడెందుకు రాజుకాలేక పోయాడో, చిన్నవాడైనప్పటికీ పాండురాజు ఎలా రాజయ్యాడో స్పష్టంగా చెప్పటం జరిగింది.

(ఇంకావుంది)

# ముద్రగడియ వాస్తు శోధకుల ఆత్మవంచన

సాముద్రిక వాస్తు విదుషీమణి శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ
ప్రొద్దుటూరు - 516 360. ఫోన్ నెం. 52239

'అందరికీ శకునం చెప్పే బల్లి తాను కుడితిలో పడ్డట్లు' అని ఒక సామెత వుంది. తన శాస్త్రం లోకానికి ఉపకరిస్తుంది. తనకు ఉపకరించదు. ఒప్పుకొంటారా? అందరికీ ఔషధమిచ్చే డాక్టరున్నాడు. కాని, అతని ఔషధాలు అతని కుటుంబానికి పని చెయ్యవు అంటే బావుంటుందా? ఈ మాటలు ఎందుకు అంటున్నానంటే, మన రాష్ట్రంలో పేరు మ్రోసిన పెద్ద పెద్ద వాస్తు పండితులున్నారు. అందరి ఇండ్లు చక్కదిద్ది భారీగా పీజులు స్వీకరిస్తూ వుంటారు. వారి ఉపదేశం పాటించినవారంతా శుభలాభ విభవాలతో మూడుపూవులు ఆరుకాయ లుగా వర్థిల్లుతూ వున్నారని ప్రచారం జరుగుతూ వుంటుంది. పరిశోధించి వాస్తవాలు నిగ్గుతేల్చినవారు లేరు. తిరుపతిలో ఈశాన్యంలో కోనేరు వుంది. కనుక క్షేత్రమహాత్మ్యం నానాటికి వర్థమానమవుతుంది అంటారు. ఎపుడైన ఏదైన అల్పమైన అరిష్టం జరిగితే, వంటశాల వైపు ఆగ్నేయంలో బావి వుంది కనుక జరిగింది అంటారు. ఇదివారి పరిశోధన వ్యాపారం. జవహర్‌లాల్ నెహ్రూగారి నివాసం చూచి, యోగకారక విశేషాలుకూడ వక్కాణించారు. కాని నెహ్రూగారి నివాసం బ్లూప్రింటు తీసుకొని, అదే నమూనాలో నూతనంగా తాము నివాసం నిర్మించుకొని దేశనాయకత్వం చేపట్టాలని వీరు ప్రయత్నించ లేదు. పోనీ వీరి మిత్రులకు గూడ ఆ సదవకాశం కల్పించలేదు. ఏల?

ఒక ఇంటిలో ఒక వ్యక్తి ఉరిపోసుకొని చస్తాడు. ఉరి అంటే కంఠానికి త్రాడు చుట్టుకొని, ఊపిరాడకుండ బిగించుకొని, ఆకాశంలో వ్రేళాడే ఆత్మహత్య. దీనికి ప్రేరకము మనసు. వాస్తుశాస్త్రరీత్యా ఆలోచిస్తే, ఊపిరితిత్తులు, గాలి వీనికి కారకుడు చంద్రుడు. ఆకాశం చంద్రుడు. మనఃకారకుడు చంద్రుడు. కనుక ఉరి అనేది చంద్రదోషంతో సంభవించే మృత్యువు. చంద్రుని దిశ వాయవ్యము. కనుక ఈ అపమృత్యుకారణము వాయవ్య దోషముతో ఆసన్నమవుతుంది.

వాయవ్యదిశలో అనవసరమయిన ఖాళీస్థలం, అప్రయోజకమైనద్వారం అరిష్ట దాయకం.

ఇక్కడ జ్యోతిశ్శాస్త్రపరిజ్ఞానం అవసరం చంద్రుడు శుభుడైతే నష్టం లేదు. పాపి అయితే నష్టం తప్పదు. చంద్రుడు పాపి

యైన వారికి ముక్కు గొట్టాలు, అంటే నాసారంధ్రాలు, సరిగా పనిచెయ్యవు. కొందరికి నిత్తెపడిశెం వుంటుంది. కొందరు నస్యం అలవాటు చేసుకొంటారు. కొందరు చీదుతూ, రొద చేస్తూ వుంటారు. వారి యింటిలో వాయువ్యదిక్కు దెబ్బతిని వుంటుంది. చూచినంతనే వాయవ్యదోషం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

ఈ విషయాలు ముద్రగడీయ వాస్తు ప్రచారకులు ఆలోచించరు. వారికి తెలిసినవిద్య అందరికీ ఒకే నమూనాలో గృహనిర్మాణం జరిపించుట మాత్రమే. ప్రకృతం తాపీమేస్త్రీలు, బేలుదారులు అందరూ నేర్చుకొన్నారు. అదే చెపుతారు. దోషజ్ఞానం శూన్యం.

ఇటీవల ఒక పేరుమ్రోసిన వాస్తుప్రచారకుని యింటిలో ఒక స్త్రీ ఉరిపోసుకొని ఉపరిలోకాని వెళ్లింది. ఆ స్త్రీ ఎవరు? అతని బంధువే. ఆ బాంధవ్యం విచారిస్తే చంద్రసంబంధమే. ఈ పరిణామం వాస్తు పండితుని యశస్సౌధం మీద అణుబాంబు పడినట్లయింది. ఈ కేసు పోలీసులకు తెలిస్తే చాలదూరం పోతుంది. అయినా రాజకీయ ప్రాబల్యంతో బయట పడవచ్చు. కాని, లోకానికి తెలిస్తే, ముద్రగెడవారు నిర్మించిన వాస్తుసామ్రాజ్యం అంతరిస్తుంది. గద్దె కూలిపోతుంది. అందుచేత పడరాని పాట్లు పడి, లోకానికి మూకుడు మూయుట జరిగింది. ఈ కేసు ముద్రగడీయ పరిశోధకులకు కనువిప్పు కలిగించుటకే తటస్థించింది.

వాస్తుప్రచారకుడు కాని, పరిశోధకుడు కాని ముందు తన యిల్లు చక్కదిద్దుకోవలెను. తరువాత ఇతరులకు చెప్పవలెను 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అన్నారు.

ఒక వ్యక్తికి యోగించిన ఇల్లు మరొక వ్యక్తికి యోగించదు. ఒక వ్యక్తికి యోగించని యిల్లు మరొక వ్యక్తికి యోగిస్తుంది. కనుక అందరికీ ఒకే నమూనా వాస్తువు సూచించు పండితుడు వాస్తువేత్త కాదు. ఇక్కడ పండితుడనుట కంటె పండితమ్మన్యుడనుట సముచితం.

వాస్తుశోధకులుగా పేరుమ్రోసిన మహాపురుషుల యింట్లో - జరుగగూడని అరిష్టం జరిగితే, అమంగళం జరిగితే, శత్రువులు తమ కట్టడాలను కూలద్రోస్తే, తమ యింటిలోని దోషమును గుర్తించి సరిదిద్దుకోవలెను. ఊరక శోధకులు, బోధకులు అని ప్రకటించుకొంటే హాస్యాస్పదమవుతుంది.

గృహం దేహం ప్రతిరూపమే. గృహంలో ఏదిశ దోషజుష్టమై వుంటుందో ఆ దిశకు సంబంధించిన అవయవం - గుండె, ఊపిరి తిత్తులు, శిరస్సు, కండ్లు, ముక్కు, కడుపు, కాళ్లు, చేతులు, వాక్కు, కళత్రం, సంతతి, ఆర్థికవ్యవస్థ, బలహీనతకు లోనగుట తప్పదు. పరిశోధిస్తే తెలుస్తుంది.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1998 జూన్ 21 నుండీ 1998 జూలై నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 21 | 28 | 5 | 12 | 19 | |
| సోమవారము | 22 | 29 | 6 | 13 | 20 | |
| మంగళవారము | 23 | 30 | 7 | 14 | | |
| బుధవారము | 24 | జూలై 1 | 8 | 15 | | |
| గురువారము | 25 | 2 | 9 | 16 | | |
| శుక్రవారము | 26 | 3 | 10 | 17 | | |
| శనివారము | 27 | 4 | 11 | 18 | | |

జూన్ 22 :- ఆరుద్రకార్తె రాక ప 2-49

జూన్ 30 :- కార్పొరేట్ అసెసీ, కో-ఆపరేటివ్ సొసైటి కానీ అసెసీలు, వ్యాపార సంబంధము లేక వృత్తి సంబంధమైన ఆదాయములు కలువని ఆదాయములు గల అసెసీలు 1998-1999 అసెస్‌మెంట్ సంవత్సరానికి పంపవలసినఆదాయపు పన్ను లేక సంపదపన్ను రిటర్నులను, అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు 1998-99 అసెస్‌మెంట్ సంవత్సరానికి పంపవలసిన గిఫ్టుట్యాక్సు రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపు

పన్నుఅధికారికి పంపుటకు చివరి తేది.

" ఆదాయపుపన్నుచట్టములోని 194 D. విభాగము క్రింద ఇన్సూరెన్సు కమీషన్ విషయంగా పంపవలసిన రిటర్ను ఫారము నెం. 26 D ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి అందించుటకు ఆఖరు తేది

" 1997-98 ఆర్థిక సంవత్సరములో ఆదాయపుపన్నును తగ్గించుకొనకుండా చెల్లించిన, లేక వ్రాసుకొన్న ఇన్సూరెన్స్ కమీషన్ వివరాలను తెలుపు రిటర్ను ఫారము నెం. 26Eని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

" పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1998 మే నెలలో చెల్లించిన జీతము, ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెంబరు 21ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అదికారికి చేర్చుటకు చివరి తారీఖు.

" 1998 మే నెల జీతములో పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు కడపటి రోజు.

" ఆదాయపుపన్ను చట్టములోని 193వ విభాగము క్రింద సెక్యూరిటీల ద్వారా వచ్చు వడ్డీలను పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు ఫారమునెం. 25ను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

" ఆదాయపుపన్నుచట్టములోని 19 A విభాగము క్రింద సెక్యూరిటీల మీద వచ్చు వడ్డీలు కాక ఇతర వడ్డీల విషయంగా పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్ను ఫారము నెం 26 Aను అందుకు సంబందించిన ఆదాయపు పన్నుఅధికారికి చేర్చుటకు తుదిరోజు.

" ఆదాయపుపన్నుచట్టములోని 194 C విభాగము క్రింద కాంట్రాక్టర్లు సబ్ కాంట్రాక్టర్లకు చేసిన చెల్లింపుల విషయంగా పట్టుకొన్న మొత్తము పన్ను వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్ను ఫారము నెం. 26 C ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు చివరి రోజు.

(త్రిప్పి చూడుము)

" 1997-98 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి, 1987 నేషనల్‌సేవింగ్స్‌స్కీము క్రింద చేయబడిన డిపాజిట్‌ల క్రింద చెల్లించిన వివరాలను తెలుపు ఫారం నెం. 26 F ను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు కడపటి రోజు.

" 1997-98 ఆర్థిక సంవత్సరములో పొందిన అద్దెల (RENTS) వివరములను తెలుపు ఆన్యువల్ రిటర్న్ ఫారము నెం. 26J ను అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు ఆఖరు తారీఖు.

జూన్ 30 :- ఆదాయపుపన్నుచట్టమునకు చేసిన నూతనసవరణ మేరకు పర్మనెంట్ అకౌంటు నెంబరును పొందుటకు పంపవలసిన 49ఎ ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి పంపుటకు కడపటిరోజు.

జూలై 6 :- పునర్వసు కార్తె రాక సా. 4-35

జూలై 7 :- మిలాదినబి

జూలై 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు.

జూలై 17 :- దక్షిణాయనపుణ్యకాలం - కటకసంక్రాంతి.

జూలై 20 :- పుష్యమీకార్తె రాక సా. 6-00

జూలై 20 :- A2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితేది.

**21, 28, 5, 12, 19 ఆదివారాలు**

---

- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# వాచవి 'వాసవి'

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు,
స్టేషన్ డైరెక్టర్, ఆకాశవాణి, ఢిల్లీ.

శ్రీ లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారు మంచి పద్య, వచన, గేయ రచయితలు. 'కన్నగి', 'హిమ బిందు', 'వాసవి' ఈ మూడు వీరి వచన రచనలు - శ్రేష్ఠిగారి సంపాదకత్వమున ముద్రితమౌచున్న వైశ్యప్రబోధినిలో ధారావాహికంగా ప్రచురించబడి పాఠకుల ప్రశంసలను విశేషముగా అందుకొన్న పై మూడింటిలో 'వాసవి' ముద్రితము. ఈ 'వాసవి' పై సమీక్షే ఈ వాచవి 'వాసవి'.

లక్ష్మీకాంతంగారు వైశ్యప్రబోధినీ సంపాదకులుగా లోకానికి తెలుసు. ఆయన కవి, రచయిత, నవలాకారుడు, విమర్శకుడు అనే విషయం చాలాకొద్దిమంది పండితులకు మాత్రమే తెలుసు. మూడు దశాబ్దాలు మాసపత్రికను అసిధారావ్రతంగా నిర్వహిస్తూ మధ్యలో ఈ నవల వ్రాశారు.

వాసవి కేవలం వైశ్యులకు మాత్రమే ఆరాధ్యదైవంకాదు. ఆమె స్వాతంత్ర్యోద్యమ సంగ్రామములో ప్రథమ సత్యాగ్రహి. ఆ విషయాన్ని నవలా రచనకు ఇతివృత్తంగా స్వీకరించారు. వాసవి త్యాగశీలి. 'అమ్మ' దయ వుంటే అన్నీ వున్నట్లే. తీసుకొన్న ఇతివృత్తం ఒక కథకు సరిపోతుంది. దాన్ని ఒక పెద్ద 'కాన్వాసు' మీద సర్వాంగసుందరమైన బృహత్‌చిత్రంగా రూపొందించడం సాహసంతో కూడినపని. దానికి పాండిత్యము, రచనాదక్షత, ఇతివృత్తనిర్వహణా సామర్థ్యము కావాలి. వాసవి నవలలో ఈ త్రివేణీసంగమం జరిగింది.

కథాకథనం : నవల ఒక ఆధునిక సాహితీ ప్రక్రియ. ఆంగ్లభాషా ప్రభావంతో తెలుగుగడ్డపై విరబూసిన పారిజాతం. సాంఘిక, పౌరాణిక, చారిత్రక నవలలు ఎందరో వ్రాశారు. ఈ నవలలో కథాకథనం చక్కగా పాఠకులను ఉత్కంఠతతో ముందుకు నడిపించేలా సాగింది. నోరినరసింహశాస్త్రిగారు చారిత్రక నవలలో దిట్ట అనిపించుకొన్నారు. ఆయన వ్రాసిన 'రుద్రమదేవి' నవల బహుమతులందుకొంది. అదేకోవలో లక్ష్మీకాంతంగారి 'వాసవి' చకచకా సాగిపోతుంది. ఘట్టాలను ఎన్నుకోవడం వాటిని నాతివిస్తరంగా - నిర్వహించడం కత్తిమీద సాము. ఈ నవలలో నేపథ్య వివరణ సవివరంగా జరిగింది.

అక్కడకూడా విశ్వనాథసత్యనారాయణగారి ధోరణి కన్పిస్తుంది. విశ్వనాథ వారిది ప్రత్యేకశైలి. వాసవి ఉద్యానవనంలో ముగ్ధమనోహరంగా నడుస్తున్నది అని మొదలు పెడతారు. వెంటనే ఆయన ధోరణి నడకమీదికి మళ్ళుతుంది. నడకలో హొయలు వివిధ రకాలు అని మొదలు పెట్టి సుదీర్ఘంగా మానవమనస్తత్వ చిత్రణ

చేస్తారు. దానికి ఆయన పాండితీ ప్రకర్ష వర్ణనాసామర్థ్యం తోడ్పడ్డాయి.

వాసవిలో నామకరణ మహోత్సవ ఘట్టం వుంది. దానికి లక్ష్మీకాంతం ఎంతో శ్రమకోర్చి ఎన్నో వివరాలు సేకరించారు. శాస్త్రీయ వైదిక పద్ధతిలో జరిగే మంత్రాలను అందించారు. ఆ ప్రక్రియను కళ్లకు కట్టేలా చిత్రించారు. 'కుసుమాంబ వెంటనే లేచి ముందుగా కుమార్తెను అందుకొని భర్త వెనుకనుండి తీసుకవచ్చి కుడిభాగమున నిలబడి, శిశువుతల ఉత్తరదిక్కుగా ఉండు నట్లుగా భర్తచేతికి అందించి, తిరగి భర్త వెనుక వైపు నుండి వెళ్లి వామభాగమందలి తన పీఠంపై తూర్పుముఖంగా కూర్చొంది.'

ఈ వర్ణన చదివిన పాఠకుడి కళ్లముందు పీటలముందు కూర్చొన్న దంపతులు పురోహితుడి ఆదేశానుసారము ఎలా నడుచుకుంటారో కన్పిస్తారు. నవలా రచయిత పురోహితుడి పాత్రను స్వీకరించి వెనుకవైపు నుండి రమ్మనడం కన్పిస్తుంది. ఈ వాక్యాలు వ్రాయడానికి నిశితపరిశీలనా దృష్టి అవసరం. కావ్యానుశీలనం, ధర్మకార్య సమగ్రవ్యవస్థపై అవగాహన కావాలి.

సంవాదశైలి : నవలలో వర్ణనలు, ఇతి వృత్తకథనం కథనశైలిలో సాగితే విసుగు పుడుతుంది. నాటకంలో సంవాదధోరణిలో టకాటకా మాట్లాడినట్లు పాత్రలచేత మాట్లాడించడం వల్ల ఉత్కంఠ పెరుగు తుంది. అవసరమనుకొన్నప్పుడు సుదీర్ఘ వర్ణన కూడ చేశారు. వాసవి, జగదీశ్వరి విశ్వమోహన రూపాన్ని సందర్శించింది. ఆ విశ్వరూప సందర్శనను ఆమె మాటల్లోనే సుదీర్ఘంగా వర్ణించారు. సినిమాలో విశ్వరూప సందర్శన ఘట్టం చూసినట్లుగా వుంటుంది

కథనునడుపుతున్నపుడు రెండు పాత్రలు మాట్లాడుతున్నట్లు చెప్పుకెళతారు. విష్ణు వర్ధనుడి పాత్రను ప్రవేశపెట్టడం నాట కీయంగా జరిపారు. నిద్రిస్తున్న విష్ణు వర్ధనుడు ఉలిక్కి పడిలేచి శయ్యపై కూర్చొన్నాడు. రాణి పక్కనే ఉంది. ఆమెకు తన దిగ్భ్రమను వివరిస్తాడు. ఇది కథా గమనంలో ప్రధానమైన ఘట్టం. విష్ణు వర్ధనుడొక గంధర్వుడు. శాపవిమోచనంలో మోహతప్తుడయ్యాడు. ఆ విషయాన్ని చెప్పడంలో ఉదాత్తతవుంది. తుచ్ఛకామ వాంఛకాక పారమార్థికమైన దృష్టితో చూడాలి. రావణుడు సీతనపహరించడం వెనుకవున్న పారమార్థికచింతనను ఈ సందర్భంలో గుర్తు తెచ్చుకోవాలి.

ప్రాబంధికశైలితో నవల సంపూర్ణంగా సాహితీసువాసనలతో గుబాళించింది. వర్ణనలు మరింత పుష్టిని చేకూర్చాయి. సరళ గ్రాంధికశైలి దానికి ఉదాత్తతను చేకూర్చింది. అవసరమైనపుడు వేద మంత్రాలు యధాతథంగా వివరించారు. శాస్త్రచర్చ చేయవలసి వచ్చినపుడు సవివ రంగా చేశారు. కథ నడుపుతున్నట్లు ఇతర గాథల ప్రభావాన్ని తెలపడం మరో విశేషం. భాస్కరాచార్యుని రాయబారిగా విష్ణు వర్ధనుని వద్దకు పంపుతున్నపుడు విరూ పాక్షుడు తదితర పాత్రలు చెప్పిన మాటలు

శ్రీకృష్ణునికి పాండవులు, ద్రౌపది చెప్పిన సంవాదధోరణి గుర్తుకు తెస్తాయి.

"గురువర్యా! ఆ దుష్టభూపతితో మాట్లాడుతున్నపుడు మన వీరయోధుల భుజబలాన్నీ, మా బాలనగరుల సమరోత్సాహాన్నీ, నాలో ఉరకలు వేస్తున్న సంగరాసక్తిని మరచిపోకండి." ఈ మాటలు మహాభారతంలోని రాయభార సన్నివేశాన్ని గుర్తుకు తెస్తాయి.

సమస్త పురాణాలతో పరిచయం నవలా రచనకు బాగా తోడ్పడింది. నియమ నిష్ఠాగరిష్ఠులైన వ్యక్తుల జీవనగమనాన్ని రచయిత యిందులో అనేకమార్లు వర్ణించారు. పురాణగాథను ఇతివృత్తానికి నేపథ్యంగా స్వీకరించి, కుబేరవృత్తాంతాన్ని ప్రస్తావించారు. హిమవంతుణ్ణి, పార్వతిని, కుబేరుని పాత్రలుగా చేసి ఒక నేపథ్యాన్ని సృష్టించారు.

విస్తృతవివరణ : నవలలో సంక్షిప్తత ఎంత అవసరమో, అవసరమనుకొన్నప్పుడు సమూలంగా వివరించడమూ అంతఅవసరం. ద్విజులకు షోడశకర్మలు సమంత్రంగా జరుగవలయును. అని మొదలు పెట్టి నిషేకము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామకరణం, నిష్క్రమణము, అన్నప్రాశన, చూడాకర్మ, కర్ణవేద, ఉపనయనము, వేదారంభము, కేశాంతము, స్నాతకము, పాణిగ్రహణము, అగ్నిపరిగ్రహణము, అంత్యేష్ఠి - అనే షోడశకర్మలను విపులంగా వివరించారు.

స్త్రీవాదధోరణి ఇప్పుడు విస్తృత ప్రచారంలో వుంది. భారతీయ సంస్కృతి స్త్రీకి విశేషప్రాధాన్యత ఇచ్చింది. ఈ విషయాన్ని లక్ష్మీకాంతం స్పష్టంగా చెప్పారు. కథలో భాగంగా తాను చెప్పదలచుకొన్న విషయాలు నిగూఢంగా చెప్పడానికి సామర్థ్యం అవసరం. కులవృత్తులను గూర్చి, వైశ్యుల ప్రాధాన్యాన్ని గూర్చి, అహింసావాదాన్ని గూర్చి, బౌద్ధతత్వాన్ని గూర్చి, హిందూధర్మశాస్త్ర వైదుష్యాన్ని గూర్చి వివరించారు.

'రూపు' మెడలో కనిపించడం వివాహిత కాదని చెపుతుంది. 'సారవిచారధీరలగు సారసలోచనలున్నచోటికిన్' అనే పద్యంలో వసుచరిత్రలో ఈ 'రూపు' ప్రస్తాపన వస్తుంది. గిరిక కన్య అనడానికి ఈ పద్యాన్ని వ్యాఖ్యాతలు ఆధారంగా చూపారు. ఇక్కడ ఈ నవలలో 'రూపు' ప్రస్తాపన తెచ్చి వివరణ ఇచ్చారు.

వాచవులూరించే నవలారచనలో లక్ష్మీకాంతం కృతకృత్యులయ్యారు. దైవిక విషయాన్ని పౌరాణిక నేపథ్యంతో జతపరచి, చారిత్రక సంఘటనలు చేర్చి సాంఘిక విప్లవధోరణికి ప్రతీకగా తీర్చి దిద్ది వాసవీ మాతను భారతమాత దాస్యశృంఖలాలు త్రెంచడానికి ప్రయత్నించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సత్యాగ్రహిగా నిరూపించారు. అందుకే వాచవులూరించే వాసవి ఆంధ్రపాఠక రసనాగ్రాలపై నిరంతరం నర్తిస్తూ అమ్మదయకు పాత్రులను చేస్తూనే వుంటుంది.

విజ్ఞప్తి



# రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య ఆం.ప్ర.

ఆఫీసు : కె.సి. గుప్త, ఇం. నెం. 4-7-324,
ఇసామియా బజారు, హైదరాబాదు - 500 027.

రాష్ట్రవైశ్యసంస్థల సమాఖ్యను 20 జనవరి 1983 తేదీన శ్రీ కె.సి.గుప్త గారు ఆలిండియా వైశ్యసమాజ్ పక్షాన ప్రారంభించినారు. వైశ్యులనగా దక్షిణాదిన నివసించు ఆర్యవైశ్యులే కాదు. దేశములో అన్ని రాష్ట్రాలలో వైశ్యులు కలరు. వారు సుమారు 100 పేర్లతో పిలువ బడుచున్నారు.

**ఉద్దేశ్యములు :**

- ఈ రాష్ట్రములో సుమారు ఒక వెయ్యి వైశ్యసంస్థలు కలవు. వాటినన్నిటిని ఒక వేదిక మీదికి సమకూర్చి సమిష్టిగా కార్యక్రమాలు నిర్ణయించి వైశ్యులకు ఇంకా ఎక్కువగా సేవ చేయుటకు తోడ్పడుట.
- వైశ్యుల ఉన్నతికి అన్ని రంగాలలో కృషి చేయుట.
- చారిత్రక పరిశోధనలు చేపట్టి పూర్వపు మరియు ప్రస్తుతపు చరిత్రలు ప్రచురించుట.
- సంఘానికి, దేశానికి ఉపయోగపడు కార్యక్రమాలకు ఘనంగా విరాళములునొసగిన దాతలకు మరియు రాష్ట్రమొత్తానికి సంబంధించిన వైశ్య సంస్థలలో కనీసము 20 సంవత్సరాలనుండి సేవచేయుచున్న ప్రముఖులకు బిరుదునిచ్చి సన్మానించుట.
  10,000/- పదివేల రూపాయలు విరాళమిచ్చు దాతలు మహారాజ పోషకులుగాను,
  5.000/- ఐదు వేల రూపాయలు విరాళమిచ్చు దాతలు రాజపోషకులుగాను,

1,000/- విరాళములు ఇచ్చు దాతలు ఈ సంస్థకు పోషకులుగాను పరిగణించ బడుదురు. వాటిపైన వచ్చు ఆదాయము సేవా కార్యక్రమాలకు, గ్రంథప్రచురణలకు వినియోగించబడును.

ఈ సంస్థ పక్షాన 10 పుస్తకాలు "భారతదేశములో వైశ్యులు' అను పేరుతో లక్ష రూపాయల వ్యయముతో ప్రచురించినాము. ఈ పుస్తకములలో వైశ్యుల ఔన్నత్యాన్ని తెలుపు వైశ్యరాజులు, చక్రవర్తులు, కవులు, పండితులు, మంత్రులు, రాజకీయవేత్తల చరిత్రలు కలవు.

"ఆంధ్రప్రదేశ్‌లో వైశ్యులు - వైశ్య సంస్థలు" అను పేరుతో 5 పుస్తకాలు వెలువడును. ఈ పుస్తకములలో ఈ రాష్ట్రములోని వైశ్య సంఘాలు, సంస్థలు, సత్రాలు, విద్యా సంస్థలు, స్వాతంత్ర్య సమరయోధులు, కవులు, పండితులు మరియు కొంతమంది ప్రముఖుల పేర్లు వుండును. 100 రూ. చెల్లించి జీవిత సభ్యులుగా చేరిన వారికి 100 రూపాయలు విలువగల పుస్తకాలు ఉచితముగా పంపబడును. మరియు ఈ సంస్థలో జీవిత సభ్యులుగా నుండుదురు.

కాబట్టి మీ సంస్థ పక్షాన కాని, తాము కాని సభ్యులుగా చేరకోరుదాము.

గోపానరసింహ్మాలు
ఆధ్యక్షుడు

జి. వెంకటరమణయ్య
ప్రధాన కార్యదర్శి

# వైశ్యసంఘములు ఉన్నతశిఖరాలను చేరుకోవాలంటే.....

1998వ సంవత్సరము మె నెల 'వై: ప్రబోధిని' మాస పత్రికలో వ్రాసిన సంపాద కీయమునకు సంపాదకులు ఎంతో అభి నందనీయులు. ఆ సంపాదకీయం చది విన తరువాత నాక్కూడ కొన్ని సంఘా లలో జరుగు అక్రమాలను ఈ పత్రికా ముఖంగా బహిర్గత పరచాలనే ఉద్దేశ్యంతో ఈ వ్యాసాన్ని వ్రాస్తున్నాను.

ఆర్యవైశ్య సంఘాలు సంఘసేవ చేస్తూ, సమాజాభివృద్ధికి పాటుపడేవిగా వుండాలి. కాని కొన్ని వైశ్యసంఘములలో పెద్దలు, పదవులనలంకరించిన వ్యక్తులు, వ్యక్తిగత కక్షలతో, అధికార దుర్వినియోగాన్ని చేస్తూ అధికారదాహంతో కన్ను మిన్ను గానక ప్రవర్తించుచున్నారు. వారు చేయు అక్ర మాలను, అన్యాయాలను చూస్తూ వూర కుండు వారికి ఏ యిబ్బంది లేదు. కాని వారు చేయు అక్రమాలను ఎదిరించిన వారు అనేక య్బిందులకు గురి అగు చున్నారు. వారు చేయు అక్రమాలలో కొన్ని గమనించదగ్గవి.

(1) ఎన్ని సంవత్సరాలు అయినను సంఘమువారు సంఘముయొక్క ఆదాయ వ్యయములను తెలపడము లేదు (2) అనవసరముగా వారి ఇష్టానుసారము డబ్బును దుర్వినియోగ పరచుచున్నారు. (3) దేవాలయములలో జరుగు కార్య క్రమములకు తినుబండారములను అవ సరమయిన దానికంటే అధికముగా తయారు చేయించి, వాటిని తమ తమ ఇండ్లకు పంపుచున్నారు. (4) సంఘ సభ్యుల పట్ల సరియైన గౌరవమర్యాదలు చూపక నిర్లక్ష్య భావముతో, ఉదాసీనతతో, హీనంగా ప్రవర్తించుచున్నారు.

నిస్సంకోచంగా, నిర్భయంగా వారి అక్రమాలను బహిర్గతము చేసి, ఎదుర్కొని మాట్లాడిన వారిని ఈ పెద్ద మనుషులు వారి వ్యక్తిగత జీవిత విషయాలలో తల దూర్చి, వారిని శారీరంగా, మానసికంగా అనేక యిబ్బందులకు గురి చేయు చున్నారు. వారిని ఏదో నెపముతో కొన్ని ఆరోపణలకు గురి చేసి వేలకొలది రూపాయలు పెనాల్టిగా విధించుచున్నారు. డబ్బు కట్టక తిరస్కరించిన ఎడల సంఘము నుండి బహిష్కరించుట, దేవాలయ ప్రవేశము లేకుండా చేయుట, గ్రామములో జరుగు శుభకార్యములకు ఆహ్వానము లేకుండా చేయుట మొదలగు యిబ్బందులు కలుగచేయుచున్నారు.

ఈ పెద్దలు, వారిని ఎందుకు బహిష్క రిస్తున్నది సంఘములో లిఖిత పూర్వకముగా వ్రాయరు. ఎలాంటి తీర్మాణము చేయరు. సంఘ సభ్యుల ఆమోదము కూడా వుండదు. ఎటువంటి నోటీసులు అందచేయరు. వారు సమాధానములు యిచ్చుటకు అవకాశము లేకుండ చేయు టయే వీరి ఉద్దేశ్యము. వారిని అదరింపు లతో, బెదిరింపులతో లొంగదీసుకోవటమే వీరి అభిమతము.

ఈ పెద్దలు చేయు దుర్మార్గపు పనులను తమ శక్తి సామర్ధ్యములతో ఎదుర్కొనుటకు గట్టి ప్రయత్నము చేయువారిని అన్ని రకములుగా లొంగదీసుకొనుటకు, ఈ స్వార్థపరులు వైశ్యేతరుల యొక్క సహాయ సహకారములు తీసుకొనుటకు కూడా వెనుకాడడము లేదు. ఇలా ఉభయ పక్షముల వారు వైశ్యేతరుల సహాయ సహకారములు తీసుకొని తలపడినట్లయితే వైశ్య సంఘములు భ్రష్టుపట్టి నామరూపాలు లేకుండా అంతరించగలవు. ఇది ఇలాగే కొనసాగితే సమాజములో మర్యాద, మన్ననలు కాని గౌరవ ప్రతిష్ఠలు కాని లేక అధోగతిపాలై, ఇతరుల పంచనపడి దాసోహమన వలసి వచ్చు కాలము దాపురిస్తుంది.

ఇటువంటి సంఘటనలు జరుగుచున్నపుడు, అనగా జిల్లా ఆర్యవైశ్య సంఘములు, రాష్ట్ర ఆర్యవైశ్య సంఘములు చూస్తూ ప్రేక్షక పాత్ర వహించక, సమాచారము అందిన వెంటనే అందులో చొరవ తీసుకొని న్యాయ అన్యాయాలతో నిష్పక్షపాతముగా వ్యవహరించి సలహాలు, సహాయ సహకారాలు అందించి అవసరమయితే మందలించి పరిస్థితులను చక్కబెట్టినపుడే గ్రామసంఘములు, జిల్లా సంఘములు, రాష్ట్ర సంఘములు తమ తమ గౌరవ ప్రతిష్ఠలను నిలబెట్టుకొని మనుగడ సాగించినపుడే సమాజములో ఉన్నతమయిన విలువలు పెరిగి, ఉన్నతమైన స్థానములకు చేరుకోగలవు

పి. రత్నాలుశెట్టి
పత్తికొండ 4-5-1998

## మీ ఉపన్యాసం చాలా విలువైనది

మాన్యశ్రీ పాలాదిలక్ష్మీకాంతంశ్రేష్ఠిగారికి నమస్సులు. ఇటీవల మాజీన్యాయమూర్తులు శ్రీ కోదండరామయ్యగారితో నేను కడపకు వచ్చినపుడు, మీరు నాకు శ్రీ కన్యకాపురాణమును, వైశ్యులు-శాఖలు-పర్యాయపదాలు ఇచ్చారు. ఇందులో రెండవది మీ ఉపన్యాసము. శ్రీ కన్యకా పరమేశ్వరిని గురించిన రచనలో వెంకటస్వామిగుప్తగారి 'విమర్శాలేశము'ను శ్రద్ధగా చదివినాను. పురాణభాగాన్ని ఇంకా చదవలేదు. మీ ఉపన్యాసం చాలా విలువైనది. బహూశా చాలా పరిశోధన చేసి, మీరు ఆ ఉపన్యాసాన్ని రూపొందించి ఉంటారు. ఈ రెండు పుస్తకాలను మీరు నాకు ఇచ్చినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను.

భవదీయుడు
పొత్తూరివెంకటేశ్వరరావు
సీనియర్ జర్నలిస్టు
హైద్రాబాద్
5-6-1998

# గిఫ్టు ట్యాక్సు

గిఫ్టుట్యాక్సుచట్టము 1958 నుండి అమలునకు వచ్చింది. ఒక ఆర్థిక సంవత్సరములో అంటే ఏప్రెల్ నెల ఒకటవ తారీఖుతో ఆరంభమై మార్చినెల 31వ తారీఖుతో అంతమయ్యే సంవత్సర కాలములో ఇచ్చిన బహుమతులకు (గిఫ్టులకు) ఈ చట్టము వర్తిస్తుంది.

వ్యక్తులు, అవిభక్త హిందూ కుటుంబములు (HUF) ప్రైవేట్ కంపెనీలు, వ్యక్తుల సముదాయములు ఒక ఆర్థిక సంవత్సరములో ఇచ్చిన గిఫ్టుల మొత్తము 30 వేల రూపాయ లకు మించినచో, ఆ మించిన మొత్తములో 30 వేల రూపాయలు పోగా, మిగిలిన మొత్తముపై 30 శాతం ప్రకారం ఈ గిఫ్టు ట్యాక్సును కట్టాలి.

అంటే ఒక ఆర్థికసంవత్సరములో ఇచ్చిన గిఫ్టుల మొత్తము 30 వేలు అంతకు లోపు ఉన్నయెడల అనగా అట్టి గిఫ్టులపై చెల్లించాల్సి ఉండదు.

ఆదాయపుపన్నుచట్టములోని 45వ సెక్షన్ ప్రకారమూ పబ్లిక్ కంపెనీలు- విలీనము కాబడిన కంపె నీలు - ధర్మసంస్థలు (చారిటబుల్‌ట్రస్టులు) ఎవరికి గిఫ్టుగా ఇచ్చినా గిఫ్టు ట్యాక్సును చెల్లించనవసరము లేదు అనగా పై మూడు రకాలకూ 'గిఫ్టు ట్యాక్సు' చట్టం వర్తించదు.

గిఫ్టు అంటే ఏమిటి?

ఒక వ్యక్తి తనకు గల స్థిరాస్తిని కానీ చరాస్తిని కానీ తనకు తానై అందుకు ప్రతిగా ఏమీ తీసుకోకుండా ఇతరులకు ఇవ్వడమూ లేక బదిలీ చేయడమూ. ఇక్కడ గమనించవలసిన అతిముఖ్య అంశం ఈ గిఫ్టు ఇవ్వడము అనేది స్వచ్ఛందంగా జరగాలి.

నగదుగా కానీ వస్తురూపముగా కానీ లేక మరే విధంగా కానీ గిఫ్టు ఇచ్చిన వ్యక్తి ప్రతిఫలాన్ని పొందకూడదు.

గిఫ్టు ఇచ్చుటకు వ్రాత మూలకమైన ఒప్పందం కూడ ఉండనవసరం లేదు. ఒప్పందం ఉన్నా లేకపోయినా గిఫ్టుగా ఇచ్చిన మొత్తము 30 వేలకు మించితే 30 శాతం మేరకు గిఫ్టుట్యాక్సును చెల్లించాల్సిందే.

బహుమతి అనగా గిఫ్టును ఇచ్చిన మొత్తాన్ని 30 వేలకు దాటితే గిఫ్టు ట్యాక్సును చెల్లించాలి. ఏ పరిస్థితుల్లోనయినా గిఫ్టు ఇచ్చిన వారు ట్యాక్సును చెల్లించక పోతే ఆ గిఫ్టును తీసుకొన్న వ్యక్తి 'గిఫ్టుట్యాక్సు' ను కట్టాల్సి ఉంటుంది.

ఒక అవిభక్తహిందూ కుటుంబములోని వ్యక్తి, తన సొంత ఆస్తిని తన ఉమ్మడి కుటుంబానికి ఇచ్చినా, ఆ ఇచ్చిన నగదు కానీ ఇతర చరాస్తి కానీ స్థిరాస్తి కానీ గిఫ్టుగానే లెక్కించబడుతుంది.

ఈ క్రిందివి "గిఫ్టు ట్యాక్సు" పరిధిలోనికి రావు.

1. విదేశీమారకద్రవ్యం చట్టము ప్రకారము నాన్‌రెసిడెంట్‌అకౌంటులో జమ పడిన మొత్తము
2. ఒక నాన్ రెసిడెంట్ తనబంధువులకు ఇచ్చిన విదేశీమారకపునిధులు.
3. కొన్ని రకాలు పొదుపు మొత్తాలు.
4. నేషనల్ డిఫెన్సు గోల్డు బాండ్లు

5. స్పెషల్ బేరరు బాండ్లు

6. పలురకాల ఇతర బాండ్లు

7. ప్రభుత్వ, స్థానిక సంస్థలకు ఇచ్చిన బహుమతులు. అంటే గిఫ్ట్స్.

8. ధర్మసంస్థలకు ఇచ్చిన విరాళాలు.

9. గుర్తింపు పొందిన దేవాలయాలు, చర్చీలు, గురుద్వారాలు, మసీదులకు ఇచ్చిన విరాళాలు.

10. తన పైన్నే ఆధారపడిన బంధువులకు తన పెళ్ళి సందర్భములో ఇచ్చిన మొత్తము లక్షరూపాయలు దాటనంత వరకు.

11. ఇన్సూరెన్సు పాలసీ

12. వీలునామా ద్వారా సంక్రమించే ఆస్తులు.

13. పిల్లల చదువులకు ఇచ్చే మొత్తము

14. మరణము ముందుకొస్తున్నదన్న భయము గలిగి ఇచ్చే గిఫ్టులు.

15. యజమాని ఇచ్చే గిఫ్టు.

16. భూదానోధ్యమం క్రింద ఇచ్చే భూమి.

17. సంపత్తిదానము అను ఉద్యమము క్రింద ఇచ్చే సంపత్తి.

గిఫ్టు ఇచ్చిన మొత్తముపై కట్టవలసిన 'గిఫ్టు ట్యాక్సును 15 రోజులలోగా ప్రభుత్వ ఖజానాకు చెల్లిస్తే ఆ చెల్లించిన పన్ను మొత్తములో 1/9 భాగం అనగా తొమ్మిదవ వంతు మొత్తాన్ని అసెస్‌మెంటు సమయములో అసెసీకి రీఫండుగా ఇస్తారు. సకాలంలో పన్ను కట్టేవారికి చిన్న ప్రోత్సాహం కలిగించాలి అని ప్రభుత్వం భావించిన ఫలితమే ఈ రాయితి.

ఆ ఇచ్చే గిఫ్టు ఆస్తికి సంబంధించినదైతే, ఆ ఆస్తి వ్రాతమూలకముగా బదిలీ జరుగుటకు గాను కట్టిన 'స్టాంపు డ్యూటీ'ని ఆ ఆస్తిని గిఫ్టుగా ఇచ్చినందుకు చెల్లించవలసిన పన్ను మొత్తములో తగ్గిస్తారు. అయితే ఆ తగ్గింపు మొత్తము చెల్లించవలసిన గిఫ్టు ట్యాక్సు మొత్తములో సగానికి మించరాదు.

ఏప్రెల్ ఒకటవ తారీఖుతో ఆరంభమై మార్చి 31వ తారీఖుతో అంతమయ్యే సంవత్సర కాలములో గిఫ్టులుగా ఇచ్చిన మొత్తాలను ఆ మార్చి 31వ తేదీ ముగిసిన వెంటనే వచ్చే జూన్ నెల 30వ తారీఖులోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారులకు రిటర్నును పంపాలి. 'లేట్‌లతీఫ్'ల కొరకు మరొక సంవత్సరము గడువును పొందవచ్చు.

ఈ గిఫ్టు ట్యాక్సు లెక్కలను చూచేందుకు ప్రత్యేక అధికారి అంటూ ఉండరు. ఆదాయపుపన్నుచట్టము మేరకు అసెస్‌మెంట్ చేసే అధికారే ఆదాయపుపన్నుతో బాటు ఈ 'గిఫ్టుట్యాక్సు' వ్యవహారాన్ని కూడ చూస్తాడు.

పైన పేర్కొన్న విధంగా జూన్ 30వ తేదీలోగా గిఫ్టు ట్యాక్సుకు సంబంధించి రిటర్ను తనకు అందకపోతే ఆ విషయాన్ని చూసే ఆదాయపుపన్నుఅధికారి నోటీసులు జారీ చేస్తారు. రిటర్నులో సంతకం లేకున్నా, రిటర్నులో చూపిన గిఫ్టు విలువను కట్టక పోయినా నోటీసు ఇస్తారు.

2-6-1998న ఇప్పటి కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ యశ్వంత్ సిన్హా పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన క్రొత్త బడ్జెట్‌లోని అంశాలలో గిఫ్టుట్యాక్సు రద్దు అని కొన్ని పత్రికలు, 1998 సెప్టెంబరు 30 నుంచీ గిఫ్టు ట్యాక్సు వసూలు పూర్తిగా రద్దు' అని కొన్ని పత్రికలు ప్రచురించాయి. అంటే గిఫ్టుగా ఇచ్చిన మొత్తముపై పూర్తిగా పన్ను విధించుట ఉండదా? లేక ఇప్పుడున్న మినహాయింపు 30 వేల పరిమితిని తీసివేస్తారా? అనునది తెలియుట లేదు.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్నిచోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - శ్రీశైలం : 87140, 87114
తిరుపతి : 50030, పుట్టపర్తి : 87240, 87440,
తిరుమల : 77682, 79327

## వైశ్య యాత్రికులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక 10 రోజులు దాతకు రూము కేటాయించబడును

12×12 రూముకు రూ.50000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించినవారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. రూ. 50,000 సమర్పించిన 15×9 సైజుగల రూము దాతఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును సం॥లో ఒక 10రోజులు రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును 3. రు 1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక బీముకు ఒక సైడు పేరు, ఫోటో వేయబడును. లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్ల మాదిరిగా పరిగణించి సంవత్సరములో 15 రోజులు రూము యివ్వబడును. కొద్దిమందికి మాత్రమే అవ కాశము.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును వీరికి సం॥నకు 3 రోజులు రూము ఇవ్వబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు ఉభయం జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, తాత్కాలికముగా వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును.

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును.

రు 1116/-లు సమర్పించినవారికి వారి ఫొటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజుల్లలో ఉభయం జరుపబడును. రు 35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 10 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీధ విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును. తిరుమలలో కూడా కొద్దిమందికి రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ పంచమ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును - మొదటి రోజు శ్రీమన్నారాయణుడు దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ముల్లచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష ద్వీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు 315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

రాబోవు క్రతువు హైద్రాబాద్‌లో చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

ప్రెసిడెంటు, వాసవీ సత్ర సముదాయ కమిటి, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంట్లు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.






# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

## రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది

ఈ అన్నదాన సంఘానికి

రూ 10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ 2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును

రూ 5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు-వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.6.1998 నుండి 20.7.1998 వరకు)

మీరు జీతములు, ఇంటి బాడుగలు మొదలగు నాటిద్వారా ఆదాయము వచ్చు ఇతరుల వర్గానికి చెందిన అసెసీలా? అయితే మీ ఆదాయపుపన్ను రిటర్నును మీకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఈ (జూన్) నెల 30వ తేదీలోగా చేయ్యాలి.

ఆదాయపుపన్నుచట్టానికి సంబంధించి మీరు చేయవలసిన ఈ నెల కర్తవ్యానికి ఈ సంచికలోని క్యాలెండరును చూడండి.

మీరు. పంపవలసిన A2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి పంపుటకు జూలై నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు A2 రిటర్నును చలానాతోబాటు కాకుండా చెక్కుతోపాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా A2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను జూలై నెల 15వ తారీఖులోగా చేయాలి.

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.